తే. గీ. నారబట్టలివేల యిం - గారుతండ్రి
తపసివేషము నేటికి - దాల్చినావు
మెడను రుద్రాక్షలెందుకు - జడలివేల
కారణము జెప్పుమా నను - గన్నకొడుక.

(సీతనుజూచి) అమ్మా! సీతమ్మతల్లీ! నీవుగూడ కొంచెము హెచ్చు తగ్గుగా నిట్టివేషమును బూనితివేమి? సాధువనకనుగుణముగా నుండవల యుననియా! (లక్ష్మణునిజూచి) లక్ష్మణా! నీవును నగ్రజునే యనుస రించితివా!

లక్ష్మ—అమ్మా! కౌసల్యామహాదేవీ! మామువ్వురచేతను నీవేషము లొకరు వేయించినారు.

కౌస—(రామునిజూచి) తండ్రీ! రాఘవా! ఈవేషములేమి? ఋషివే షములు నాకుఁ జింతయు, వింతయుఁ గొలుపుచున్నవి.

తే. గీ. పట్టభద్రుఁడవౌదన్న - వాక్యమేది
గురుఁడుపెట్టినలగ్న మే - తెరవునరిగె
వింతవేషము లేటికి - వేసినారు
కారణము జెప్పు చిత్తంబు - కలఁతఁజెందె.

నాయనా! రామచంద్ర! మాటలాడవేమి?

సీ. కస్తూరికా తిల - కము బెట్టుమోమున
భూతియారీతిని - బూసితేల
మేలైనహారము - లీలించుగళమున
తులసిరుద్రాక్షల - నిలిపితేల
కమ్మగంధఁగినూనె - కడురాచు కేశముల్
మునులజడలరీతి - ముడచితేల
పట్టుదుకూలము - లట్టుచుందువు నార
బట్టలనిప్పుడు - గట్టితేల

తే. గీ, వీరుగూడ నీవేషము । వేయనేల
చెప్పుమీ కారణంబున్నఁ । జెప్పవేల
దీనికెల్లఁ గారణమును । దెలిపినాదు
చిత్తము కుదుటపడునట్లు । జేయుమయ్య.

లక్ష్మ—అమ్మా! కైకమ్మగారు మాముగ్గురకును నీవేషములు వేసి వనవాసనాటకమాడుమని సెలవిచ్చినారు. తెలిసినదా తల్లీ!

సుమి—అదేమి ! కుమారా! నీమాటలలో నర్థము సరిగాఁ దెలియుటలేదు.

శ్రీరా—(కౌసల్యనుజూచి) తల్లీ! ఇందులకుఁ గారణము నేను చెప్పెదను, నీవు చింతింపవలదు. మున్ను శంబరాసురయుద్ధసమయమున మాతండ్రి కైకమ్మగారు చేసినసహాయమునకు మెచ్చి రెండు వరంబులిచ్చియున్నవారఁట. అందుచే నావరంబులామె యిప్పుడు కోరినది. అందొకటి నను బదునాల్గువత్సరము లరణ్యమున వసింపఁబోవుటయు. రెండవది భరతునకుఁ బట్టము గట్టుమనియుఁ గోరెను.

కౌస—హా! ఎంత నిర్భాగ్యురాలను (మూర్ఛిలును.)

సుమి—అయ్యో! కుమారా!

(కౌసల్య పాడెడిపాట.)

హిం॥ తోడిరాగం—ఏకతాళం.

॥ హా కాలమహిమ కేమని దలంతునయ్యో దైవమా॥

అ॥ వ॥ లోకమాన్యుఁడు। పావననాముఁడు। నాకుమారుఁడు శ్రీరామునకు శ్రీకరముగ యౌవరాజ్యము రేపు పట్టాభిషేక మొనరించెడితరి ఓ కైకా నీకేయపకారం బొనరించితినని నోర్వవైతివి॥ హా కాల॥

కౌస—(మూర్ఛ తెలిసి) హా! తనయా! రవివంశభూషణా! జ్యేష్ఠుండవు నీవుండఁగా భరతునకుఁ బట్టముగట్టుమని కోరుట కామెకెట్లు

నోరువచ్చినది. (కైకనుద్దేశించి) అయ్యో! కైకా! నేనుగాని నా కుమారుఁడుగాని నీ కేమియపకారము గావించియుంటిమి! మామొదల నీకింత యసూయ యేలకలుగవలెను? భర్తనీకు వశుఁడై యుండెనుగదాయని యిట్టికోరిక కోరుదువా! అక్కటా! శ్రీరామచంద్రమూర్తి యెవ్వరికిని నపకారము సేయువాఁడు కాఁడే. (దశరథునుద్దేశించి) హా! మహారాజా!

తే. గీ. కైకపైనను నీకంత కరుణయున్న
చీరలో రత్నతతియు యిచ్చెదరుగాక
కన్నకొడుకు నీరీతి నుగ్రాటవులకుఁ
బంపుమనఁగాన వంపుదే పార్థివేశ.

ఏతండ్రులైనను కుమారులను నిట్లుజేసిరా.

తే. గీ. రాఘవా! రేపు నిన్నును రాజుఁగాగ
నిలుపుదమటంచుఁ బల్కిన నీదునోట
వనములందునఁ బదునాల్గు వత్సరములు
వాసమునుజేయఁ బొమ్మంచుఁ బలికితెట్లు.

నాథా! కైకకోరిక దీర్చుటయే ధర్మమని తలంచితివిగాని మఱేమియు విచారింపవైతివి.

[రాముఁడు పాడెడిపాట.]

ఫీలువా రాగం-ఏకతాళం.

ప॥ కోకిలకవ్మా! నాకొరకు మదిని సుంతయైన ॥కో॥

అ॥ ప॥ లోకంబున జనకుని సత్యంబు గాపాడుకొరకు
మీకు నేను పుత్రుఁడనై పుట్టితినని యూహింపుము ॥కో॥
ఆకైకమ్మనుగాని । అకల్మషుఁడు తండ్రినిగాని
నాకై దుఃఖముననుండి । వారిసం దూషింపకమ్మా ॥కో॥

శ్రీరా — అమ్మా! నీవుచింతింపవలదు. ఇందు తండ్రివలనఁగాని కైక మ్మగారివలనఁగాని యేమాత్రము దోషములేదు. సత్యవ్రత బద్ధుడై నాతండ్రి యీవరములు నిచ్చియున్నాఁడు. తండ్రిగారిసత్యమును నేను గాపాడవలయును. ఈధర్మము నీకును దెలిసియే యున్నది. నేను జానకీలక్ష్మణ సమేతముగా నరణ్యమునఁ బదు నాల్గు వత్సరములును చరించివచ్చెదను. ఈవిషయమున నీవుతండ్రిగారి నేమియు నని యాగ్రహము జెప్పింపక యాయనచిత్తవృత్తి ననుసరించి ప్రవర్తింపుము.

తే. గీ. భవ్యగుణుఁడైన భరతుండు భక్తితోడ
నాకు మాఱుగ నెప్పుడు నీకువలయు
కార్యముల దీర్చుచుండును గానమదిని
జింతయనుమాట నావంత చేర్పకమ్మ.

(సుమిత్రనుజూచి) తల్లీ! సుమిత్రాదేవి! ఈలక్ష్మణుఁడు గూడ నావెంట వచ్చుచున్నాఁడు.

తే. గీ. వలదువలదంచు నెంతయో పలికినాఁడ
గాని వినక నావెంటరాఁ బూనినాఁడు.
కొఱఁత యేమియువీనికిఁ గూర్పకుండ
నరసిరక్షించి తోడ్తెత్తు మరలనీకు.

సుమి — నాయనా! రామభద్రా! నీవెంటనున్న వీని కేకొఱంత గల్గును. నిరంతరము నీచరణసేవతప్ప నన్యమెఱుఁగనియీతఁడు పుణ్యమూర్తియగుటచేతనే నీతోనరుదెంచుచున్నాఁడు.

కౌస — (రాముని జూచి) కుమారా! రాఘవా! నీవువనంబులకుఁ బోవుదునని చెప్పినంతనే నాప్రాణముపోవుచున్నది. నిన్నువిడిచి నేనెట్లుజీవింపఁగల్గుదును. నాకేమిదారిఁజూపింతువు. నన్నుఁగూడ నీవెంటఁగొనిపొమ్ము,

శ్రీరా—అమ్మా నీవు పుత్రవ్యామోహమున నట్లు చింతించెదవు. నా మాటవిని నీవు ధైర్యస్వాంతవుగమ్ము. ఇంకమాకనుజ్ఞనిమ్ము.

కౌస—అయ్యా! తండ్రీ! నన్ను విడిచిపోవుదువా?

తే. గీ. భరతునృపుజేయఁ గైకకు ♦ వాంఛయున్న
నట్టివరమునె యేల ♦ యడుగరాదు
వనములకునిన్నుఁ బంపఁగా ♦ వలయుననుచుఁ
గోరగానేల నాకును ♦ శోకగాక.

సీత—అత్తగారూ! మీరుకొంత ధైర్యమును బూనవలయును. ఈరీతిని దుఃఖించినందువలనఁ బ్రయోజన మేమియును లేదు. ప్రాణేశ్వరుని వెంటనరుగుటకు నాకాజ్ఞనిండు.

కౌస—పుణ్యాత్మురాలవగునీవు నాథుని వెంటఁ బోవుచుంటివా! రాముని వివాహమాడి యెట్టిసౌఖ్యమునో బొందుదువని నీతండ్రి తలంచినాఁడు కాని యిట్లు నాథునితో నరణ్యాదుల పాలగుదువని యెన్నఁడును దలంచి యుండఁడుకదా. లోకమున గొందఱు సతులు తమపతులు నిర్ధనులుగను, దుర్బలులుగను నున్నచోఁ జులకనఁ జూతురు. నీవట్లుగాక నాథునివెంట ఘోరారణ్యముల కరుగుచుంటివి సాధ్వీ లోకమున నిన్నుఁజెప్పి మఱియొక్క పతినిఁ జెప్పవలయును, తల్లీ! సీతా! శ్రీరాముఁడు నిర్ధనుఁడుగాఁడు మహేంద్రవైభవమునందఁదగినవాఁడు. దుర్బలుఁడునుగాఁడు ఒక్కసారి విల్లుచేఁబూని నారిసారించి తీవ్రదృష్టితోఁ జూచెనేనిమూఁడు లోకములును వడఁకును కాని కాలపాశమున నిట్లు బద్ధుఁడైనాఁడు. పితృవాక్య పరిపాలనార్థమైయీతఁడు పదునాల్గువత్సరములును నరణ్యములఁ జరించి, వచ్చి రాజ్యశ్రీకిఁ బట్టాభిషిక్తుఁడై మహేంద్రభోగముల నందఁగలఁడు.

సుమి—(లక్ష్మణునిఁజూచి) వత్సా! లక్ష్మణా! రాముని వెంటఁబోవుచున్న నీపుణ్యమే పుణ్యము నీకొక్క సంగతిఁజెప్ప వలసియున్నది. ఈజానకి పతివ్రత; అరణ్యమంతయు రాక్షససంచారమైయుండును. రాత్రులయందుగాని పగలుగాని శ్రీరాముఁడు నిద్రబోవునపుడైనను వేయేల సర్వవేళలయందును శరాసనధరుండవై యీమెను రక్షింపుచుండుము. మఱియింకొక సంగతికలదు. అమ్మహారణ్యభూమియే సాకేతనగరంబుగను, నగ్రజుండైన శ్రీరాముని దశరథభూపాలునిగను, సీతాకాంతను నన్నుగను భావించి యతిజాగరూకుఁడవై మెలంగుము. అన్నివేళలయందును వీరిరువురను రక్షించు భారము నీదైయున్నది.

లక్ష్మ—శ్రీరామసేవతప్ప నాకుఁగావలసినదేమున్నది.

శ్రీరా—(కౌసల్యనుజూచి) తల్లీ! ఇంక మాకనుజ్ఞనిమ్ము.

కౌస—నీవు వెళ్లుదునని పలికినంతనే నాకు దుఃఖము వచ్చుచున్నదోయి?

శ్రీరా—ఇట్టిసమయమున ధైర్యమే సహాయము సేయును.

కౌస—తండ్రీ! విచారించినను లాభము లేదు, ఇదిగో! గుండెరాయిఁజేసికొన్నాను. వత్సా! ఇటురమ్ము

శ్రీరా—(సమీపించును.)

కౌస—కుమారా! అఖిలదిక్కులును, సూర్యచంద్రులు, భూమ్యాకాశంబులును, సమస్తదేవతలును, నిన్నురక్షించెదరుగాక. మున్నమృతముఁదెచ్చుటకై యరిగిన గరుడునకు నాతనితల్లి యగు వినతామహాదేవి యొసంగినయాశీర్వచనములును రక్షలును సదా రక్షించుగాక. వనవాసము పూర్తిజేసి సుఖమైవచ్చి మాకన్నులకానందము గలిగింతువుగాక. (లక్ష్మణునిఁజూచి) నీవీలక్ష్మణుని నతిజాగరూకతతోఁ జూడవలయును. లక్ష్మణా! నిన్ను సమస్తదేవతలును రక్షించెదరుగాక. సుఖమైయున్నతో మరలి వ

త్తువుగాక. (సీతనుజూచి) అమ్మా! జానకీ! పతివెంటనున్న నీకే కొఱంతయుఁ గలుగకుండుఁగాక. త్రిమూర్తులభార్యలెవ్వరును నీవెన్నంటియుండి రక్షించుచుందురుగాక.

శ్రీరా—అదిగో సుమంత్రుఁడు రథము తెచ్చి వాకిటనిలిపినాఁడు. (కౌసల్యనుజూచి) అమ్మా! సెలవు (సీతారామలక్ష్మణులు కౌసల్యాసుమిత్రలకు నమస్కరించి నిష్క్రమింతురు.)

(తెరవాలును.)

రంగము—[సాకేతనగరమునకు వెలుపలనున్న బయలు.]

శ్రీరాముఁడు సీతాలక్ష్మణ సమేతముగా రథమెక్కి ప్రవేశము.

(తెరలో)

ఉ. ఓరఘునందనా! రవికులాంబుధి పూర్ణశశాంక! కీర్తివి
స్తార! తపఃఫలంబ! సముదారగుణాకర! రామచంద్ర! యీ
తీరున నన్నుఁ బాయుట మదిన్ దలపోయఁగ ధర్మమౌనె; నీ
తేరును నాపుమయ్య యిదె తీవ్రరయంబున నేనువచ్చెదన్.

(శ్రీరామాదులు ప్రవేశింతురు.)

శ్రీరా—(సుమంత్రునిఁజూచి) సుమంత్రా! మాతండ్రి నన్నుఁ బాయఁజాలక యతిశీఘ్రగమనమున నన్ను గలసికొనుటకువచ్చుచుఁ దేరు నాపుమని కేకలిడుచున్నాఁడు. ఈసమయమున నతఁడు మనలఁ గలిసికొనినచో మనవెంటనంటి రాఁగలఁడు. కావున రథం బాతనికిఁ గనఁబడకుండఁ దోలుము.

సుమం—మంచిది. (నిష్క్రమింతురు.)

దశరథుఁడు—(పై పద్యమును జదువుచుఁ బ్రవేశించి) ఓరామా! నేను గూడ నిన్నుగలియవచ్చుచుంటినని బలుకుచుండఁగా రథంబాపక పోవుట ధర్మమా! నీవు వనవాసములకరిగినచో నాకేమి దిక్కు.

చం. వనజహితాన్వయాభరణ ! భాసురసద్గుణశీల, నిన్ను నే
వనములకంపి నేనిచట ! బ్రాణముతో మనశక్యమౌనె; నీ
వెనుకను వచ్చుచుంటి రథ ! వేగము నాపుమొకింత నేను నే
వనములనుండువాడ ముని ! నాథులఁగొల్చుచు నిన్నుజూచుచున్

అయ్యో! యెన్ని కేకలు వేసినను రథమాగకయున్నది. (సుమంత్రునుద్దేశించి) ఓసుమంత్రా! నీవైనను నామాటవిని యొక్కింత రథవేగము నాపుము. శ్రీరామమూర్తి నెడబాసి యుండఁజాలనని నేను వానింగలసి యరణ్యములం దుండుటకు వచ్చుచున్నాఁడను. నీవైనను నాయందు దయవహించి రథమాపుము.

తే. గీ. సత్యగుణుఁడైన శ్రీరామ ! చంద్రమూర్తి
లేనిరాజ్యమేటికి నాకు ! లేమ లేల
భాగ్యభోగములేల; యిరా ! ప్రాణమేల
వానివెంటనె యుండెద ! వనములందు

(ఇంచుకయూరకుండి) ఈసుమంత్రుఁడుగూడ రథమునాపకయున్నవాఁడు. అదిగో! రథముగూడ చాలదూరముపోయినది.

తే. గీ. అదిగో శ్రీరామచంద్రుఁడు ! నదిగో పూత
చరితయైన సీతమ్మయు ! లక్ష్మణుఁడునదిగో
రథముపోవుచున్న వేగ ! రాముఁగలియఁ
జాల (భగవంతునుద్దేశించి) హా దైవమా నన్ను గావరాదె.

అదిగో! రథముఁగూడ దృష్టిపథమునుండి తప్పిపోవుచున్నది. హా రామచంద్రా! ఎంతపిలిచినను నిలువకయరిగితివా? ఇంక నేనేమి సేయుదును నిన్నువిడిచిన నాశరీరమున మాత్రము ప్రాణములు నిలుచునా? హా! రామా! పితురాజ్ఞాపరిపాలనా! నీవిషయమునఁ గైక యెంతక్రూరకర్మ మాచరించెరా తండ్రీ! అదిగో! రాముఁడరిగినాఁడు. ఇంక నే నాత

నిం గలిసికొనఁజాలను. నాచిత్తమున నదియొక విధమగు దడ జనించుచున్నది. కన్నులు తిరుగుచున్నవి. లోకమేమియుఁ గానిపించుటలేదు. అడుగులు తడబడుచున్నవి. అయ్యో! నిలువఁజాలకున్నాను. నాదేహమునఁ బ్రాణములుగూడ నుండునట్లు గానిపించదు. ఇంక నేను రామచింతనముననే బ్రతికెడు నాల్గునాళ్ళను కాలము వెళ్ళఁబుచ్చెదఁగాక!

(నిష్క్రమించును.)

ఇది ద్వితీయాంకము.





# పాదుకాపట్టాభిషేకము

తృతీయాంకము,

రంగము:—[గంగాతీరము—శ్రీరాముఁడు, సీతాలక్ష్మణ
సుమంత్రులు ప్రవేశము.]

శ్రీ—(సుమంత్రునిజూచి) సుమంత్రా!

మ. కొడుకా! తేరునునాపరాయనుచు నా । క్రోశించుచున్ వెంటవ
చ్చెడునాతండ్రి యవస్థఁజూడకనిరున్ । శీఘ్రంబుగాఁ దేరునున్
నడుపంగాదగునంచు జెప్పితినహా । నాతండ్రి యుద్దానికిన్
గడుదుఃఖించియెయుండుఁగాదె యకటా । కష్టంబుగల్గించితిన్.

అకటా! మాతండ్రిగారిదుఃఖమునకు నేనేకదా కారణము.

సుమం—రామచంద్రా! ఇందులకుఁ గారణము నీవెట్లగుదువు. మీ యిడుమలకును, మీతల్లి చింతకును, దండ్రిగారి వగపునకును కైకయేకదా కారణము. ఆవరమునే కదా యింతకొంపతీసెను.

శ్రీరా—ఆమెనుగూర్చి మనమేమియుఁ బలుకరాదు.

తే. గీ. ఆజి నామెచేసిన సహా । యమునుమెచ్చి
యిచ్చినట్టివరద్వయ । మిపుడుదీర్చి
సత్యమును నిల్పికొనఁగనా । జనకతఁడు
కైకయందున లోపంబు । గలదె చెపుమ!

కైకను నిందించినచో మనకు పాపముగూడ సంభవించును. అదియ ట్లుంచుము.

తే. గీ. తల్లి కైకమ్మ కరుణచే తగద యఖిల
మునులకును నివాసమా వన భూమితతియుఁ
బావనంబైన గంగా నదీ వంతి నిపుడు
గనులపండువుగాఁ జూడఁ గలిగె మనకుఁ

ఇంతకన్న గావలసిన భాగ్య మేమియున్నది.

సుమం—రామచంద్రా! నీహృదయము మతినిర్మలమైనది. కానిచో కైకమ్మగారివలన దోషములేదని చెప్పుదువా! సవతిసుతుఁడ వని యిట్టి యిక్కట్లు పెట్టఁదలంచెనుగాని లేనిచో నిన్ను వన వాసిఁ జేయుమని యేల వరంబుగోరవలయును. ఇంతకంటెఁ గో రుట కేమియు నామెకుఁ దోఁచలేదా, పోనిమ్ము. భరతుని రా జుగాఁ జేయుమని గోరినఁగోరుగాక. నీకీవనవాసమేల?

శ్రీరా—సుమంత్రా! ఇందలిరహస్యము నీవు గ్రహింపలేకపోయితివి. కైకమ్మగారు స్త్రీయయ్యును రాజ్యతంత్రమునందు మిగుల సామర్థ్యము గలిగియున్నది. మాతండ్రిగర్భమున జనించిన నలువురిలో నేను జ్యేష్ఠుఁడనుకదా, అందుచేత నేను రాజ్యపరి పాలనార్హుండను. భరతునకుఁ బట్టము గట్టింపవలయు ననుకో రిక పత్యేకముగనే కోరుటకాక సంశయమూమె పొందియుం డును. జ్యేష్ఠుండవగు నేను పురంబుననుండఁగా భరతుఁడు రా జగుట యేమని ప్రజలాడుకొందురనిగాని, భరతుని రాజ్యపరి పాలనంబున పురంబున నేనుంటినేని, రాష్ట్రజనులందఱును నా పట్టాభిషేకోత్సవమునకై యెదురుచూచుచుండుటచేత నేనేమ యిన నడుగలిగింతునేమోయనిగాని, తలంచి నన్నుఁగూడ వన వాసిగాఁ జేయుమని కోరియుండును. అంతియెకాని తల్లిగారికి నావంతయేని కోపములేదు. భరతునికన్న నెక్కుడుభక్తితో నామెను సేవింతుననసంగతి యామెకు సంపూర్తిగఁదెలిసియు

న్నది. ఏదియెట్లున్నను స్వాభావిక రామణీయతతోఁ జెన్నొందు మహారణ్యావాసంబును, మునులసేవలజేయు భాగ్యమును నాకు దయవలననే మాకుఁ గలిగినదని చెప్పవచ్చును. మా కాకు మహోపకారిణి.

సీత—ఆహా! ఆకాశమునఁ దిరుగాడు స్వరూపుండగు భానుండు తన ప్రచండకిరణాళిని బ్రసరింపఁ జేయుచున్నాఁడు.

శ్రీరా—(సీతనుజూచి) రమణీమణీ!

[అరణ్యప్రవేశమున రాముఁడు సీత పాడెడి డైలాగ్ పాట) 15

బేహాగ్ రాగం-చాపుతాళం.

రాము—ప॥ పడతీ! సుకుమార! సుందరాంగి! వలదంచు నేవచియింపఁగా॥

అ॥ ప॥ కడుప్రేముడిఁ నను! వీడకన్ వెడ! లీయడవులన్ నడచుచున్

యిడుమలు బడుచుఁ బడలిక జెందుచు! వెలవెల బారియుంటివే! పడతీ!

సీత—వినుప్రాణలోల! యినకులశీలా! సకలసద్గుణాలవాలా

ననుగూర్చి విచారింపు! మంతయున్ మన! మందునఁ

బెత! జెందకన్.

మనముత్సాహము! నఁ విహరిందుఁడు మనోహరా

నఁ మన్నించి! విను॥

రామ—తే. గీ. రాజరుషియయిన జనక । రాజపుత్రి

వై దశరథుకోడల । వై నిరంకు

శంబుగా లోకమేలెడి । శక్తిగల్గు

వానిభార్యవై యుండియు । వానిమిత్త

మకట యడవులం జరియింప । నయ్యెనీకు.

ఆవిధాత యెప్పటికేది వ్రాసిపెట్టెనో యెవ్వరికినిఁ దెలియరాకదా? నా
కున్నచో నాగర్భశ్రీమంతురాలవును, సుకుమారశరీరవునగు నీకెన్నఁ
డైన నరణ్యవాసము గలుగునని నీవు దలంచియుంటివా? ముందుకా
లమున నేమిసంభవించునో యెవ్వరును నెఱుఁగరాకదా?

తే. గీ. తగినసంబంధమియ్యది ఽ తరణివంశ
శేఖరుండగు దశరథ ఽ జ్యేష్ఠసుతుఁడు
రామచంద్రుఁడు వీరుఁడు ఽ రమణివాని
భార్యవై కడుసౌఖ్యంబు ఽ బడయఁగల్గు
ననుచు సంతోషమందుచు ఽ జనకుఁడతివ
నాకు నిన్నిచ్చెగాని నీ ఽ కీకరణిని
భర్తతోఁగూడివనినుండ ఽ వలసివచ్చు
నంచునెక్కింతయూహింపఁ ఽ డయ్యెఁగాదె.

సీత—మనోహరా! నీవు నన్నుఁగూర్చి యిట్లు పలికెదవేల!

తే. గీ. సకలసామంతరాజన్య ఽ సంఘమెలమిఁ
గొలువ రాజ్యంబుబాలింప ఽ వలసినట్టి
నీవిరాష్ట్రంబువిడిచి యి ఽ ట్లేగుదేర;
వలయునే నాకు సౌఖ్యంబు ఽ లలితచరిత.

నీవు నన్ను గూర్చి చింతింపవలదు.

శ్రీరా—సీ. పరిచారికాతతి ఽ నిరతంబుసేవింప
భాసిల్లుచుందువు ఽ పడఁతిమిన్న!

సీత—భర్తతోనుండిన ఽ భయదమృగంబులె
ఘనపరిచారికా ఽ జనములౌ ను

శ్రీరా—ఉద్యానవనమందు ఽ సొంపుగాఁదిరుగుచుఁ
జెలఁగుచుందువుకదా ఽ చిగురుబోఁడి!

సీత—ప్రాణేశ్వరునితోడ । వనవాసమైనను
　　　　　　ను ద్యానవనమటంచు । నెన్నుచుందు
శ్రీరా—మహనీయమణిమయ । మందిరంబులయందు
　　　　　　వసియించెదవుకదా । వారిజాక్షి!
సీత—కోమలాంగునివెంటఁ । గొండలందుండిన
　　　　　　మందిరంబులెయటంచు । మదిఁదలంతు
శ్రీరా—హంసతూలికపాన్పు । నందునశయనించి
　　　　　　యలరుచుండువుకదా । తలిరుఁబోఁడి!
సీత—హృదయనాథునిగూడి । నేలపైఁబండిన
　　　　　　తల్పంబెయటంచును । దనరుచుందు
శ్రీరా—తే.గీ. నట్టిసౌఖ్యంబులనుబాసి । యకట! నీవు
　　　　నన్నుగూడి యరుదెంచి । నన్నుదొరఁగి
　　　　పడగలేనట్టి కష్టముల్ । పడుచునుండి
　　　　యెట్టులోర్వంగఁ గలుగుదు । వివ్విధంబు.
సీత—తే.గీ. ప్రాణనాథునితోనుండి । పడుచునున్న
　　　　కష్టమంతయుమిగుల సు । ఖంబెయగును
　　　　పతినిసేవించి వరలెడి । పడఁతికెపుడు
　　　　రమ్యగుణసాంద్ర! శ్రీరఘు । రామచంద్ర!

సుమం—(తనలో) ఆహా! ఈసీతహృదయము నెంతయుఁ బొగడవల
　　సియున్నది. తనకై విచారింపుచున్న నిజేశ్వరునికిట్టి వాక్యము
　　లఁ జెప్పి విచారము పోఁగొట్టుచున్నదో! అక్కటా! ఈదంప
　　తు లిట్టి కష్టములఁ బొందవలసినవారా?
(కైకనుద్దేశించి) హా! కైకా!
　తే. గీ. పాపమిదియంచుఁ దలఁపక । భవ్యగుణుని
　　　　రామునిసతీయుతముగ న । రణ్యములకుఁ

బంటసాహసించితివిగా ॥ పాపచిత్త
మెంతగా విచారింతును ॥ స్వాంతమందు.

కీర్తిశాలియు సద్గుణమూర్తియునగు కేకయరాజగర్భమున జనించిన నీకిట్టిగుణము లెట్లలవడెనో తెలియకున్నది. రాముఁడు నీకు సవతిసుతుఁడేయగుఁగాక. కలనైన నీకెగ్గుజేసియుండెనా ? నీకెన్నడైన నవిధేయుఁడై జూపియుండెనా? రామునకిట్టిముప్పు దెచ్చిపెట్టినందువలన నీకువచ్చులాభము, నీనత్తినిజను లోకనిందతప్ప మఱియొకటి కానిపించదు. (ఇంచుకయూరకుండి) ఏమిది ! నేను కైకను దూషింపుచుంటిని. ఎఱిఁగియో యెఱుఁగకనో కైక యిట్టివరంబులు కోరినంతనే, న్యాయమార్గవిచారణుండగు దశరథుఁ డిట్లంగీకరించినాఁడు ! ఆహా ! కాంతామోహముకన్న కుమారునిఁగూడఁజూడనిచ్చునుకాదు కాఁబోలు. ఇట్టివరములుగాక మఱివేఱువరములు గోరుకొనుమని దశరథుడు కైకకు బుద్ధిఁజెప్పినచో నింతవఱకు వచ్చునా. ఏదో సత్యమని యూతఁడు పేచ. చేసినాఁడు. ఇప్పుడెవ్వరినేమన్న లాభమేమున్నది. ఇంతకునుగొన్నాళ్ళిట్లిడుమ లరణ్యంబునఁ బడుమని యూసీతారామలక్ష్మణుల మొగంబులయందు విధాత లిఖయించినాఁడు, ఆతనివ్రాత దాటుట కెవరికినిఁ దరము కాదు కదా? కాని యొకదానికిమాత్రము నాకు దుఃఖ మొదవుచున్నది.

చ. తనయులు పుట్టలేదనుచు ॥ దైవతపూజలఁ జేసిచేసి; మఱి
తనయులనల్వురన్ సుగుణ ॥ ధన్యులమాన్యులఁ గాంచియిప్పుడున్
గనులకురెప్పలట్లుగను ॥ గాంచుచుఁ బెంచిన తండ్రియే కటా
వనముల కేఁగుఁడీయనుచుఁ ॥ బంపెను వీరలనంచుఁ గుందెదన్.

(అందఱినిజూచి) సుకుమారశరీరులైన వీరి మొగంబు లెండఁబడుటచేత వాడి, యెండలోవైచిన తామరతూండ్లవలెనున్నవి. ఇప్పుడేవీరిట్లుండిరి. పదునాల్గువత్సరము లెట్లరణ్యములందు గాలము గడుపుదురోకదా

శ్రీరా—సుమంత్రా ! నీవేదియో దీర్ఘాలోచనము సేయుచున్నావే ?
సుమం—తండ్రీ! రామచంద్ర ! ఆలోచనయేమున్నది. విచారమే.
శ్రీరా—సుమంత్రా ! ఇప్పుడువిచారమెందుకు?
సుమం—రామా ! విచారమెందులకందువా ?

తే. గీ. సకలభూచక్రమేలెడు । చక్రవర్తి
పాటకుసుమారు వనభూము । లందుఁదపసి
వేషమునుబూని చరియింప । వెలఁదిగూడి
తమ్ముఁడును వెంటరా నట్లు । దరలివచ్చి
సంపులకునిట్లు రాఘవా । యాత్మవగతు.

శ్రీరా—సుమంత్రా ! నీకిపిచ్చియేమి?

చ. జనకునిసత్యశాసనము । సమ్మతి శీర్షమునందు దాల్చి యీ
వనములఁ గొన్నివర్షములు । వాసముచేయఁగ భక్తిఁదమ్ముఁడున్
వనితయు వెంటరాఁగ నిటు । వచ్చెనురాఘవుఁడంచు నెమ్మదిన్
ఘనముదమందకీకరణిఁ । గాంచెదవేల విచార మక్కటా.

తే. గీ రాముఁడిట్లు జేసెనటంచు । రహిజగానఁ
గీర్తిడిండిమప్రజలు మ్రో । గింత్రుగాదె
దానిచే మాకులీనుల । ధర్మపరత
శాశ్వతంబుగనుండును । క్ష్మాతలమున.

సుమం—రామచంద్రా! నీవంటిధైర్యమును బూనఁగలవుగాని నాబోఁ
ట్లు బూనఁగలరా ?

తే. గీ. నీవు పురివీడి వచ్చుచో । నీప్రయాణ
మెఱిఁగి; పౌరులెల్లరు వచ్చి । యిట్లు మమ్ముఁ
బాసిపోవుదువాయంచు । వగచినపుడు
వారికీవువచించిన । వాక్యసమితి
చిత్తమున నాటియున్నది । శ్రీగుణాఢ్య.

శ్రీరా—సుమంత్రా! నీకు నాయందున్న వాత్సల్యమున నట్లు వక్కా
ణించెదవు. ఏదియెట్లున్నను పితృవాక్పరిపాలనము పుత్రున కు
భయలోకములందునను గీర్తి దెచ్చునుగదా?

సుమం—రాఘవా! నీగుణము లిదివరకే లోకమునఁ బ్రకాశించుచు
న్నవి. సమస్త రాజ్యశ్రీసౌఖ్యములను బరిత్యజించి యడవులం
దుఁ జరించినఁగాని కీర్తి రాదని తలంచితివా యేమి?

శ్రీరా—ప్రత్యేకముగ నట్లుచేసిన వోఁ గీర్తి గలుగునా? తండ్రిగారి
సత్యశాసనముఁ బాలించుటకుఁగదా వచ్చితిని. ఇయ్యది యా
చంద్రతారకముగా నిలుచునట్టి కీర్తికిఁ గారణముగదా?

సుమం—రామా! నీవెట్లు చెప్పినను జెప్పఁగలవు. (సీతనుజూచి) తల్లీ!
జనకరాజపుత్రీ! జనకుని పూర్వపుణ్యవిశేషమున నాతనికిఁ
బుత్రివై, పుడమిరాచూలికిఁ బట్టివై, సప్తద్వీపసముద్రముద్రి
త మహీచక్రము నిరంకుశంబుగఁ బరిపాలించు దశరథచక్ర
వర్తికిఁ బెద్దకోడలవై. సకలగుణాభిరాముఁడగు శ్రీరామునకు
భార్యవై యుండి యింతవఱకును శుద్ధాంతసౌధమునఁ బరిచా
రికాశతంబు నిరంతరంబును భక్తిఁ గొలువ సమస్తసౌఖ్యముల
ననుభవించుచున్న నీకీదుర్ఘటంబైన వనవాసము సంభవించెను
గదా! అమ్మా! నీస్థితికి నే నేమనివగతును!

సీత—సుమంత్రా! భగవత్సముండగు ప్రాణేశ్వరుని వెంటనుండ నే
బడు కష్టములన్నియును నాకు సుఖములే యగును సుమా! నే
నెప్పుడును గోరునది పతి నెన్నఁడును బాసియుండకుండుటయే.

సుమం—(లక్ష్మణునిఁజూచి) తండ్రీ! లక్ష్మణా! నీవుగూడ నగ్రజుని
వెంట వచ్చితివి.

ఉ. రాముని నెంతయుం ఘనతరంబగు భక్తిని గొల్చుచుండి యీ
భూమిఁ జరించుచుండెదవు పుణ్యుఁడ వెంతయు నీవు నిప్పుడా

రాముని బాయలేకను న । రణ్యములందునఁగూడ శ్రీరఘుస్వా
మికి సేవఁజేయఁగను । వచ్చితివెంతయు సంతసంబునన్.

నీవు మహా పుణ్యమును జేసియుండుటచే సీతనివెంట వచ్చు భాగ్యము లభించినది.

మ. వనమందెండకు వానకోర్చి మును లే । భవ్యాత్మునింజూడఁగా
ఘననిష్ఠం దపమాచరించియు వెసన్ । గానంగ లేకుండురా
సనకాద్యుత్తమసానిపూజితపదా । బ్జాతుంగు నాశ్రీతుగా
మనమందెంచి నిరంతరంబు భజియిం । పన్ వాకు నానందమౌ.

సుమం.—లక్ష్మణా! నీవెంతయుఁ గృతార్థుఁడవు.

శ్రీరా—(అందఱినిజూచి) ప్రియసీ! లక్ష్మణా! సుమంత్రా! అటు జూడుఁడు.

సీ. విశ్వగర్భుఁడగుచు । వెలుఁగొందు హరిపదా
బ్జములసేతు తలఁప । జన్మగృహము
భక్తజనోల్లాసి । పాపవినాశిని
వారణాసీపురి । వాసభూమి
పార్వతీవల్లభు । వరజటాజూటపరి
దేశంబు వాట్యంపు । దివ్యసీమ
స్నానమాడినయంత । సకలాఘసమితిని
బారద్రోలుట చూడ । వరమగుణము

తే. గీ. అట్టిపరమపావనమాదు । నలరుగంగ
జూడుఁడీ మదికి మిగులఁ । జోద్యముగను
కనులపండువ యగుచును । గ్రాలుచుండు
దాటఁబోదము రండిఁక । దానినిపుడు.

సుమం—(తనలో) మేమును గంగను సమీపించినాము. ఇప్పుడే రాముండు గంగను దాటుదమని చెప్పుచున్నాఁడు. ఈతని నోటి నుండి యీమాట వెలువడగానే నాప్రాణము లెగిరిపోవుచున్నవి. అయ్యో! ఇంక నన్నితఁ డయోధ్యాపురమునకు మఱలిపొమ్మని చెప్పును గాఁబోలు.

తే. గీ. పరమపావనమూర్తులైయె । వరలునట్టి
రాముఁడనుజయుతముగ న । రణ్యములను
వదలి యెట్లుపోవుచునేను । భావమందు
నేమిసేయఁగఁదోఁచ దిఁ । కేమిసేతు.

(అందఱును నడచుచున్నారు.)

[గంగానదినిజూచి లక్ష్మణుఁడు పాడెడిపాట.]

కమాచిరాగం—ఏకతాళం.

ప॥ ఆహా ద్రుమపర్వవిరాజితమగు యీనదిన్॥

అ॥ ప॥ ఓహో వర్ణింపనలవిగాకుండెన్ ఆహా॥
మహామహులు సర్వమునులు సదా యీసమీపమునన్
విహరించుచు కడునిష్ఠన్ । ధృతివహించి తపమొనర్చి ఇష్ట
కామ్యా! సిద్ధులై । ధన్యులౌదురు ॥ఆహా॥

లక్ష్మ—అగ్రజా! మనము పరమపావనమైన గంగాతరంగిణిని సమీపించినాము. ఆహా! ఈగంగాజలంబెట్లు ప్రకాశించుచున్నదో.

తే. గీ. ఎందుస్నానమాడిన యంత । నెల్లమునులు
సురలును మనుజకోటియు । శోభగాంతు
రట్టివిమలసలిలవారి । యైనగంగ
గాంచఁగంటిమి కన్నుల । కఱవుదీఱ.

[గుహుఁడును—సేవకుఁడును ప్రవేశము.]

సేవ—(గుహునిఁజూచి) ఇదేంటి. వేషాలేసుకొని వచ్చిన వీరెవరు? సూస్తేనాకు భూజియు మేస్తావుంది.

గుహు—అదేంటార్, కొట్టారాదేంటి. సొత్తిమెంగదూ జయంత్రావు. వీరు సాలాగొప్పోరులాగున్నారోయ్. దగ్గర కెళ్ళి వంగతి చంద ర్వాలు కూంతకనుక్కొందాం రారా. (రామాదులను జూచి) బాబులారా! మీరోరు. ఈ యేసాలేమిటి? ఏటుదాట్టారాదేంటి. బాబూ. ఈయూడమ్మోరోరు.

సుమం—నిషాదా! నీపేరు గుహుఁడు కాదా? వీరిని నీవెవ్వరును జూచియుండలేదా?

గుహు—బాబూ! మీది అయోద్దె కాదంటయ్యా? నువ్వు సుమంత్రయ్య వేనా? ఈ రెవరో ఏం గెప్తిలేదు.

సుమం—దశరథమహారాజుగారిని వినియుంటివా?

గుహు—చరిచరి. ఆయన్నెరక్కుండా వుండాలి. ఆయన నన్ను సూస్తే వంచపానాలువిడుస్తాఁడు. ఈనావనునడుపుకొన్నందుకు నన్ను కట్టడం లేదంటయ్యా?

సుమం—సరిసరి (సీతా రామలక్ష్మణులను వేరు వేరుగఁజూపుచు)

తే. గీ. ఇతఁడు రాముండు దశరథు జ్యేష్ఠపుత్రుఁ
డితఁడు తమ్ముండు లక్ష్మణుం డీరాము
భార్య జానకి జనకభూపాలపుత్రి
తెలియవచ్చెన యింకఁ దేట తెల్లముగను.

గుహు—సాలారోజులయింది గాని బాబూ! ఈపిల్లల పెళ్ళిళ్ళకు గుహప్రవేశానికి నేను సారకువ్వు, తేన తెచ్చి మహారాజుగారికి కానక్కట్టాను.

సుమం—ఇంక చెప్పవలసినదేమున్నది. అందఱను నీవెఱింగియే యుంటివి.

గుహు—(రామునిఁజూచి) బాబూ ! నీవు మా పెభువ్వు. నీపాదాలికి దండాలు.

(మ్రొక్కుచున్నాఁడు.)

శ్రీరా—గుహుఁడా ! నీభక్తికి సంతసించితిని.

గుహు—దొరలు రావడంసేత మాకు సంతోషంకలిగింది, రామయ్యా బాబూ ! లచ్చుమయ్యా తండ్రీ! అమ్మా సీతమ్మతల్లి! ఎండలో వున్నారు. ఈ చెట్టునీడకురండి.

(అందఱు వృక్షమునీడనుఁజేరుదురు.)

గుహు—(సేవకునిఁజూచి) ఓరేయి. నావతెరసాప తీస్కోనిరారా. చ ట్టికిందేస్తే రామయ్యాబాబు కూర్చుంటాడు.

సేవ—(నిష్క్రమించి వెంటనే గుడ్డతెచ్చి చెట్టుక్రింద పఱచును.)

గుహు—బాబుల్లాలా! ఇందామీద కూకోండి.

(అందఱునుగూర్చుందురు.)

గుహు—(రామునిజూచి) నాయనా ! రామయ్యతండ్రీ! ఇల్లా ఎం దాకా పెయాణం పెట్టుకొన్నారు. ఇల్లాటి మునులయేసాలు యేసినారెందుకు. సీతమ్మతల్లినికూడా యెంటబెట్టుకొని వ చ్చారెందుకు, ఆడోర్ని తీస్కోని యిలా మీాలోటోరు వత్తా రంటయ్యా. కూడా నౌకర్లు చాకర్లుయేరి. ఓరూ లేకుండా వ చ్చారు (సుమంతునిజూచి) సుమంతయ్యా! తెల్సినోడవు నువ్వుసెప్ప లేదంటయ్యా.

శ్రీరా—నిషాదా !

తే. గీ. తండ్రిసత్యంబు పాలింప 5 తపసివేష
మూని; తమ్ముండు వెంటరాఁ 5 బొలఁతితోడ

వనములందునఁ బదునాల్గు 5 వత్సరములు
సంచరింపఁగ భావించి 5 సదయహృదయ.

గుహు___అదేంటినాయనా; అరణ్యాల్లో యున్నేళ్ళుండడం యేంటి. తండ్రిగారి సత్తెం యేంటి. పాలించడం యేంటి.

సుమం___శంబరుఁడా ! కైకమ్మగారిని నీవువినియుంటివికదా? దశరథ మహారాజుగారామెకుఁ బూర్వమెప్పుడో రెండువరములిచ్చి యుండుటచేత వానినిప్పుడిమ్మని కోరగా రాజుగారు సమ్మతించినారు. భరతుని రాజుగాఁ జేయుమనియు, రాముని పదునాల్గు వత్సరము లరణ్యమున వసింపఁజంపుమనియు కోరెను. సత్యపాశబద్ధుఁడై దశరథుఁడందుల కంగీకరించెను. ఈ కారణముచే నీరాముఁడిట్లువచ్చినాఁడు ఈతని నెడఁబాసి యుండలేకవీరియవ్వరును గూడావచ్చిరి.

గుహు___గొప్పగుణాలువున్న దశరథమహారాజే యిలాటి వరాలు ఇచ్చినాఁడటయ్యా. మంచికుని సేశాడు. కొడుకునడవులకంపుకుంటాడా ! ఆడోరిమాట అంత తియ్యగా వుంటుంది కామోసు. (రామునిజూచి) రామయ్యతండ్రి ! నువ్వేంటి. అడవుల్లోవుండడానికెల్లడం యేంటి. సాలుసాలు. పురానిక మర్లండి. మీాకేం బయంలేదు. నేను మానిషాదపోళ్ళబలంతో మీాతో వత్తాను. కైకమ్మ భరతయ్యకు ఎల్లాపట్టంకట్టుందో సూస్తాను. అతఁడు రాజ్యమెల్లాయేల్తాడో తమాసా కనుకొంటాను. పెద్దోడవు నీవుండగా భరతుఁడు రాజ్యమేల్తాడా . ఈమాట వోరన్న యిన్నారంటే మొగతాళి సేయరంటయ్యా ! (ఇంచుక యూరకుండి) అలోసిస్తావెందుకు బాబూ? అయోధ్యాద్య కెల్దాంపదండి నాబలం సిద్ధంచేసొనివస్తాను.

శ్రీరా.—గుహా! నీకు నాయందున్న వర్ణనాతీతమయిన ప్రేమకు సంతసించితిని, జనకుని సత్యశాసనము పాలించుటయే నాకుఁ బరమధర్మము. సుమంత్రుఁడిచ్చటనుండి పురంబునకు మరలి పోఁగలఁడు. ఇప్పుడు మేమీ భాగీరథిని దాఁటి యావలకుఁబోవలెను. కావున నీవు మాయందు దయయుంచి నావ సిద్ధపఱుపుము.

గుహు.—మాయయ్యా! మాతండ్రి మా రామయ్యా! నువ్వరణ్యాల్లోకి యెళ్ళుతుంటె నేను సూసి తాళగలనా! పోనీ! తండ్రీ! నువ్వు పురానికెల్లొద్దు మాపల్లె రాజ్యానికి నీకు పట్టంగట్టాను. మమ్మల్ని రచ్చిస్తూ మాకుదొరవైయుండు నీసెప్పుసేతల్లో మేము వుంటాము. నువ్వెల్లాసెప్తె అల్లా మేము నడ్చుకొంటాము. నీకేం యిక్కడ తక్కువుండదు. నీకోసం పత్యేకంగా పెద్దగుడిసె ఒకటి యేయిత్తాను. నీయిట్టంవచ్చినట్లుండవచ్చును.

శ్రీరా.—నిషాదవల్లభా! నీకృపకు నేనెంతయు సంతోషించితిని. రాజ్యముతోఁగాని తత్సంబంధమైన సౌఖ్యముతోఁగాని నాకేమియుఁబనిలేదు. తండ్రిగారి సత్యవాక్యము పాలించుటయే నా ప్రధానకార్యము. ఇంక నీవు మఱిమొందువదియింతక నావ సిద్ధము చేయుము.

గుహు.—పెభువుల్లాసెప్తే ఏమంటాను నావ సిద్ధము చేస్తాను.

(నిష్క్రమించును.)

శ్రీరా.—(సుమంత్రునింజూచి) సుమంత్రా! మేమన్న నీకుఁగడుప్రేమ. మమ్ముల రథముపై నెక్కించుకొని మిగుల దూరము వచ్చితివి. ఇంక మేమిచ్చటనుండి గంగనుదాటి యావలకరుగుదుము. కావున నీవీప్రదేశమునుండి రథము మరలించుకొని పురంబున కరుగుము.

ఉ. మాకడఁగల్గు ప్రేమ; నను మానముగానక యింతదైన నీ
నీకడ జేరుదోలుకొని యింతటిదూరమువచ్చినావు భూ
నాయకుఁడంపగా నిటు, మనంబున నిప్పుడు నాకు నిన్నడం
బాయఁగఁ బుట్టదింక మను బాయక తప్పదిఁ కేమిచెప్పుదున్.

సుమం—తండ్రీ! రామచంద్రా! నిన్నడవుల కప్పగించిపోవుటకు నాకుఁ గాళ్లెట్లాడును?

తే. గీ. ఎత్తి పెంచితి నిన్ను నే నెంతదైన
వలువమొంతియు బురదయా భాతి జంకఁ
బెట్టుకొని చరియించితి ప్రేమతోడ
నకటా! నిన్ను వీడి యెట్లరుగఁగలను.

తండ్రీ! రామచంద్రా! వచ్చునప్పుడు మిమ్ముందఱను రథముపైఁబెట్టుకొనివచ్చి యిప్పుడు శూన్యరథముతోఁబోయి పురంబెట్లు ప్రవేశింతును. రామా! నిన్నుఁబాయఁజాలను, నాయందు కృపాంతరంగుఁడవై నన్నుగూడ నీవెంటనుండుటకు నాజ్ఞయిమ్ము.

శ్రీరా—సుమంత్రా! నీవు విచారింపవలదు. జనకుని యాజ్ఞననుసరించి వనములందు బదునాల్గువత్సరములనుగడిపివచ్చెదను. నిన్ను విడనాడుటకు మాకును చిత్తము సమ్మతింపకున్నది. కాని విధి యాజ్ఞ యుల్లంఘనీయముకదా? ఇఁక నీవు చింతవీడి పురము జేరి మాకై వెంగఁగొనియుండు తండ్రిగారికి ధైర్యముఁ జెప్పుము.

సుమం—చంద్రుఁడులేని రాత్రి చందమున—సంతతిలేనికుటుంబము రీతి—దీపములేని మందిరము తెఱంగున నుండు సాకేతనగరం బెట్లు ప్రవేశింతును!

శ్రీరా—సుమంత్రా! చింతింపక ధైర్యముగనుము.

తే. గీ. గంగ దాటితిమంచుఁగై కమ్మతోడ
నమ్మగా వచియింపుమీ నెమ్మనిపు
మాకునై చింత నొందెదు కొమ్మకళతు
ధైర్యవంతునిఁ జేయుమీ దయదలిర్ప.

మాముప్పురతల్లులకును నమస్కారములని చెప్పుము.

లక్ష్మ—సుమంత్రా! కైకమ్మగారు మాయునికింగూర్చి నమ్మమరో లేదో. గంగానదిని దాఁటి యావలకేగితిమని యామె నమ్మున ట్లు చెప్పుము. మాతల్లియగుసుమిత్రాదేవితో,

తే. గీ. నీదుయాజ్ఞను వాలిపై నెమ్మిదాల్చి
జానకీనాయకుని పాద సరసిజముల
భక్తితోడ సేవింపుచు వరలుచుండు
లక్ష్మణుఁడటంచుఁ జెప్పు మా హ్లాద మొనఁగ.

సీత—సుమంత్రా! ముప్పురత్తలకును, మామగారికిని నమస్కారము లని తెలుపుము. చెల్లెండ్రకు దీవెనల నెఱింగింపుము.

గుహు—(ప్రవేశించి) రామయ్యతండ్రీ! నావసిద్ధము జేసినాను.

శ్రీ—ఇదిగో! వచ్చుచున్నాము. (సుమంత్రునిజూచి)

ఉ. కాననముల్ వసింపఁగను గామినితోడను నేగిరంచునున్
మానసమందుఁ జింతిలక మాటికిమాటికి నింక ధైర్యముం
బూనుమటంచు జెప్పు పరి పూర్ణకృపారసమూనుచున్ సుమం
త్రా! నిను నమ్మియుండెదను దండ్రినిగూర్చి మనంబునందునన్.

ఇంక నీవేగుము. మేము పోయివచ్చెదము.

సుమం—(కన్నీరుగార్చుచు) రామా! మిమ్మెడఁబాయవలసివచ్చినందు లకు నాకెంతయు దుఃఖము పొంగిపొరలివచ్చుచున్నది. అయి నను దప్పదయ్యెను. వత్సా! రామచంద్రా!

తే. గీ. విపినవాసము గావించి ♦ వేడ్క మీరు
మరలఁ బురికేగుదెంచెడి ♦ తఱిని నేను
బ్రతికియుందునొ లేదొ నా ♦ వ్వారికనెఱుక
కరుణఁజూచుచు నొకసారి ♦ కౌఁగిలిమ్ము.

(రాముని గౌఁగిలించుకొనును)

శ్రీరా—సుమంత్రా! చింతింపకుము.

(నిష్క్రమింతురు.)

సుమం—అదిగో! వారందఱును నావ నెక్కుచున్నారు. ఇఁక నేనును వరిగెద. (నిష్క్రమించును.)

ఇది తృతీయాంకము.



శ్రీ

# పాదుకాపట్టాభిషేకము.

## చతుర్థాంకము.

[కౌసల్యామందిరములో దశరథుఁడు, కౌసల్య ప్రవేశము.]

దశ—హా! రామా! రవికులరత్నదీపా! సాకేతపుర రాజ్యపీఠంబున నిన్నుఁ గూర్చుండఁబెట్టి నేను భగవచ్చింతనంబునఁ గాలము వెళ్లబుచ్చఁదలంచఁగా నిట్లయినదికదా! అయ్యో! కైక నాకొంప యొంతతీసెనురా! పట్టభద్రునిఁ జేయుదునని పలికినయానోటితో కైకవరముల కారణమున సత్యవాక్పాశబద్ధుఁడనై నిన్నరణ్యములకేగుమని చెప్పితినికదా? ఇట్లరణ్యములకరుగుమని చెప్పినందులకు నీవు నాపైన నేమనియలిగితివో కదా. నీవు నాపైన నలుగుదువని నేను తలంచను. నీవలన నావంతయేని దోషము లేదు. నీధర్మవర్తనము, నీసద్గుణములు, నీవినయబుద్ధి యెవ్వరికిని రాదు. నీయెడల నింతకాఠిన్యము వహించిన కైకను నొక్కమాటయైన నొవ్వనాడి యెఱుఁగవు. నీకు నేను విచారించుచుంటిని గాని నీపితృభక్తి లోకంబున కాదర్శకముగాఁ జేసితివి. వత్సా రాఘవా! సీతయు లక్ష్మణుండును నీవెంట వచ్చుటం జేసి యెంతయు ధన్యులు.

కౌస—నాథా! జరిగినదానికై మీరిట్లు విచారించినందువలన లాభమేమియున్నది. మనస్సును మఱింత క్షోభపెట్టుటకే కదా?

దశ — మోహపాశబద్ధుఁడనై కైకను వివాహమాడుట రాముని ఘోరారణ్యవాసిగాఁ జేయుట కొఱకే కాఁబోలు! కాకున్న నింతకఠినకర్మమునకు నేనొడిగట్టుదునా? నా రామచంద్రునిఁ బాయుదునా! ఆ కైక యింక నేవో వరంబులు గోరునని తలంచితిగాని యిట్లు నా పుట్టిముంచునని యెఱుఁగనైతిని. హా! రామా! కుమారా! నీవిషయమై పట్టాభిషేకమున కెన్నియో వస్తువులఁ గూర్చితినిగదరా! నీపట్టాభిషేక మింక నాటకమయ్యెనుగదా! రాఘవేంద్రా!

తే. గీ. ఎచటనున్నావు సీతయు ఽ నెట్టులుండె
ననుజుఁ డేమి సేయుచునుండె ఽ నకట నిన్ను
బాసి, ఘోరదుఃఖాబ్ధిఁ ఽ బడితినయ్య
రఘుకులాంభోధిచంద్ర శ్రీ ఽ రామచంద్ర.

కౌస — నాథా! ఏల యిట్లు శోకించెదరు? ఒకవేళ యిప్పుడు రాముని రమ్మన్నను సత్యశాసనబద్ధుఁడైన యాతఁడు రాఁడుకదా?

దశ — దేవీ!

సీ. ఇంతకు శ్రీరాముఁ ఽ డెంతదూరము బోయి
యుండునో యెచ్చోట ఽ నుండఁగలఁడొ
మనమంత్రియైన సు ఽ మంత్రుఁ డేదారిని
రథముఁగొని చనెనొ ఽ రమణిసీత
యేరీతినుండెనో ఽ యీరీతిగావించె
మనతండ్రియంచు ల ఽ క్ష్మణుఁడు నన్ను
నేభంగి దూరునో ఽ యేక్రియ నుండునో
బాధల నేవిధిఁ ఽ బడుచునున్న

తే. గీ. వారొ; యెట్లు చింతనుమ్రింగి ఽ వారొ; యెట్టి
చట్టుదాటునకును వారు ఽ చేరినారొ

కటకటా వారి కెట్టి సంకటముఁదెచ్చి
పెట్టితి నెంతయు నవి వేశినగుచు.

కౌస—నాథా! ఊరడిల్లుఁడు.

[తెరలో]

అమ్మా! కౌసల్యామహాదేవి! నేను సుమంత్రుఁడను. లోనికి రావచ్చునా?

కౌస—నిరాటంకముగ.

సుమంత్రుఁడు—(ప్రవేశించి దశరథునిఁజూచి) మహారాజా!

దశ—ఏమి! సుమంత్రుఁడా! సుమంత్రా! వచ్చితివా?

తే. గీ. వంశతిలకమౌ శ్రీరామ భద్రునచట
విడచివచ్చితివయ్య వే వేగఁదెలుపు
సీతయెట్లుండె సౌమిత్రి క్షేమమెట్లు
బాపురే చింత వారల వార్తఁదెలిపి.

మా రామయ్యతండ్రి యేమి సేయుచున్నాఁడు? అతఁడు నాకుఁ జెప్పిన మాట లేమి? లక్ష్మణుఁడు నాపై నాగ్రహించుచుండెనా?

సుమం—మహారాజా! నీవు వారికై విచారింపవలదు. వారందఱును సేమముగనే యుండిరి, నేను వారిని గంగానది డాఁటించివచ్చితిని. శ్రీరాముఁడు మిమ్ములను దనకై దుఃఖింపవలదని చెప్పినాఁడు.

దశ—అయ్యో! మా రామభద్రుని గంగానదిని దాటించితివా? అతనికై నేను దుఃఖింపకుండుట యెట్లు?

కౌస—సుమంత్రా! మా రామచంద్రుఁడు నన్ను దుఃఖము దిగమ్రింగుమని యాతఁడేగినప్పుడే చెప్పినాఁడు.

సుమం—మహారాజా! నేను గృహమునకరిగి మరల వచ్చెదను. (నిష్క్రమించును.)

దశ—హా! తన్వీ! రాముని ఘోరారణ్యసంచారిగాఁ జేసితినిగదా? ఇంక నేనెట్లు జీవింపఁగలను. ఏనాఁడు రాముని బాసితినో యానాఁడే నేను మరణించినవారిలోఁ జేరితిని.

కౌస—పాపము శమించుఁగాక. ఇంతగా నేను విలపించుచున్న నేమని చెప్పుదును.

దశ—ఆరాముని జూడకున్న నాప్రాణములు నిలువవు. ఆతనింజూచుట తటస్థింపదు; శ్రీరామవియోగమున నేను మేనుదొఱఁగుట నిశ్చయము. ఇందు పరమరహస్యముకలదు. పూర్వము నేనొకసారి సరయూతీరప్రాంతవనికి వేటఁకుబోయి సంధ్యాసమయమున నొక వృక్షముక్రింద విశ్రమించియుండఁగా, నదియొద్దున నొక మునిబాలుఁడు భాండముచే నీరుముంచుచుండెను. ఆశబ్దమును విని నేను మదగజంబనితలంచి యాతనిపై శరముప్రయోగించితిని. శరప్రహారమున నామునిబాలుఁడు కేకవేయ నేను విని ఘోరకార్యముఁ జేసితినిగదాయని విచారింపుచు సమీపించి యాతనివలన నాతనితల్లిదండ్రుల వృత్తాంతమెఱిఁగి వారికిబాలు నిమృతి నెఱింగించితిని. వారు ఘోరముగ నేడ్చినీవు పుత్రవియోగమునఁ బ్రాణములు వాయుదువని శాపమిచ్చిరి. ఇప్పుడది నాకనుభవింపక తప్పదు.

కౌస—నాథా! మీరధైర్యము విడవలదు,

దశ—ఇంకెక్కడి ధైర్యము. నాకిలోకమంతయు రామునితోనున్నది. రాముఁడు లేనిచో నాకేమియును లేదు. అంతా రామమయం. ఎక్కడజూచినను రాముఁడే. అడుగో రాముఁడు, ఇదుగో రాముఁడు ఓరామా! రా. నీతండ్రినగునన్నుఁ గౌఁగిలించు కొనుము.

కౌస—(తనలో) ఈయనమాటలుయొక్క ప్రలాపన హెచ్చిపోవుచున్నది. ఇదేమి కర్మము.

దశ—

తే. గీ. రామ! జితకామ! జగదభి రామ! రామ!
రాజవంశాబ్ధిసోమ! శ్రీ రామ! రామ!
రామ! సద్గుణసాంద్ర! శ్రీ రామచంద్ర!
రామ! శ్రీరామ! జయరామ! రామ! రామ!

(మూర్ఛిల్లును.)

కౌస—ఈయన మాటలాడుచునె కన్నుమూసి మూర్ఛిల్లినాఁడే. నాథా! నాథా! ఏమిపలుకవు? అయ్యో! నాకేమియుఁదోఁచకున్నది. సత్వరముగ వైద్యుని రావింపవలయును.

(నిష్క్రమింతురు.)

(తెర వ్రాలును.)

రంగము:—[మందిరములో ప్రవేశము.—కైక, భరతుఁడు.]

[భరతుఁడు ప్రవేశించి పాడెడి పాట.]

బేహాగ్ రాగం - ఏకతాళం.

ప॥ ఓ పాపీ! యెంత ఘోరముఁగ మొనరించితివే॥ ఓ పాపీ॥

అ॥ ప॥ యీపురిన్ జనులు! ఘోరునర్ యేడ్వ రాముని సీతలక్ష్మణుల్ కాపుర మొనరింపఁగ బంపితివా కారడవులకున్ కాణాచీ పాపీ! యీవనిన్ గోరిబలాత్కారముగ జనకునిన్ స్వర్గమంపితివా. ఓ పలుగాకి నీపుత్రుఁడనై నేనేలనుధరఁబుట్టితి నే॥

భర—హా! పాపీ! ఎంత దుష్కార్యమాచరించితివి. నిర్మూలమున సూర్యవంశమునకెల్ల దురవస్థ సంభవించెనే.

తే. గీ. రమ్యగుణధాము రాముని రాణ్ముపులకుఁ
బంపి సూర్యవంశంబును బాడుసేయ

భూమియందుఁ బుట్టితివి కాఁ జోలు నీవు
కేకయావనీంద్రసుత మత్కీర్తిఁ గోలుప.

అకటా! ఎంత కార్యమాచరించితివి! నిన్నుఁగన్న తల్లికంటె నెక్కువ ప్రేమతోఁ జూచు శ్రీరామునకా యెగ్గు సల్పితివి. అమ్మహాత్మునకు నాయందున్న వాత్సల్యముగూడ దగ్గునట్లు చేసితివి. దీనికంతకును నేనే కారణమని యాతండెంత యాగ్రహించెనో గదా. సోదరవత్సలుఁడగు మాయన్న కరణ్యావాసముగల్పించితివా? ఛీ! దుష్టమతీ ! నీముఖంబుఁజూచినఁ బంచమహాపాతకములు సంభవించును.

ఉ. రాముని దేవసన్నిభు నరణ్యములన్ జరియింపఁ బంపె ను
త్రామనిభుండు దండ్రి నిటు ప్రాణము వాయఁగఁ జేసినావుగా
గోముఖపుండరీకగతిఁ గోమలివైతివి నాదుతండ్రికిన్
భూమిని నిన్ను జంపినను బొందను పాపము వేయునేటికిన్.

నీవిట్టి పరమచండాలవని తెలియక మాతండ్రి నిన్ను చేపట్టి మోసపోయెనుగదా! నిరంతరమును ధర్మము దప్పక పాలించు నాతండ్రి మృతికి నీవేకదా కారణము. రామచంద్రుఁ డెంతగా చింతించెనో. ప్రాణములు బోవునట్లు నాప్రియజనకుఁడు రామునకై యెంత విలపించెనో ఎండకన్నను వానకన్నను నెఱుఁగక శుద్ధాంతసౌధంబులయందు వసింపుచు సౌఖ్యమందు సీతామహాదేవి కట్టి యిక్కట్లుగల్పించితివి. అన్నగారిపదంబుల సేవింపుచు వెంటనేగు భాగ్యము లక్ష్మణునకు లభించెను; సీతారామలక్ష్మణులు లేని యీసాకేతనగరంబు నెత్తినిగట్టుకొనఁ దలంచితివా! ఎన్నడైనను నాకీరాజ్యము కావలెననిగాని, లేక యిట్టి వరంబులఁ గోరుమనిగాని నేను నీకుఁ జెప్పియుంటినా! ఇట్టివరములు కోరుమని నీకెవ్వ రుపదేశించిరి?

(తండ్రినుద్దేశించి భరతుడు పాడెడిపాట.)

జయంతశ్రీరాగం - టప్పా.

ప॥ హాజనకా సకలసద్గుణతిలకా॥ జనకా॥

అ॥ ప॥ యీరాజగతిని మముబాసి దివికేగితివా॥ జనకా॥

రాజ్యము భరతునకు పట్టాభిషేక మొనరించి
పూజ్యుని శ్రీరాముని యడవులజరియింపగజేసిన
యీరాజదురాలను యేలజీవముతో విడితివి నాలుక చీరికలుజేసి
నక్కలపాల్ జేయవైతివి॥ జనకా॥

దశరథభూపాలా! నాపైన నీవేమియనుమానమందితివో కదా తండ్రీ! దుర్మార్గురాలగు నాతల్లివలన నీవిట్లువంచింపఁబడితివి, అక్కటా! రామవియోగమున బ్రాణములబాసి మమ్ముందలవిడిచి పోయితివా! ఇట్టివరము కోరిన నాతల్లిని నీవేలయూరకొంటివి? ఖడ్గమున జంపియున్నచో బాగుండునుగదా? అవును. సత్యవాక్ప్రతుఁడవగు నీవిట్టి కార్యమేల చేయుదువు.

కైక—కుమారా! శాంతివహించి నామనవులాలింపుము. గతించిన దానికై నీవువిచారింపకుము. కడుపునకన్న తీపి మఱియొకటిలేదని లోకులు చెప్పుదురు. అందుచే. సవతికొడుకగు శ్రీరాముఁడు రాజయ్యేనేని నీవతనిని సేవింపవలసివచ్చుననియు, నీవు రాజవై యుండగాఁ జూడవలయుననియు నిట్లుగోరితిని. నలువురిలో నన్నల్లరిపెట్టక రాజ్యమేలుకొనుము; నీవేమీ రాజ్యమేలుదువను నాశచే నిట్టివరములడిగి లోకనిందకుఁ గూడ పాలయితిని.

(భరతుడు పాడెడిపాట.)

సింధుకమాచిరాగం - చాపుతాళం.

ప॥ ఈకట్టము నానెత్తిని బెట్టుటకా యిట్టిచెట్టబుట్టించితివి॥

అ॥ ప॥ ఓపాపీ ! యీనగరికిఁ । బిడియమునకఁ । నుడియకనె
యీపురి ప్రభుత్వగరిమను గొనుమని యేనాలుక తో బల్కితివే
ఈపట్టము॥

సాకీ—ఈవరమపావనమూర్తిః సాధుజనానువర్తి సర్వప్రపంచమేలద
గు శ్రీరామమూర్తి … …
ఆపవిత్రచారిత్రుని పాదసేవ నాజీవన
మీభాగ్యము, యీరాజ్యము । నీతలఁగట్టియేలవే॥

భర—ఛీ! పాపీ! ఇంకను సిగ్గులేక రాజ్యమేలుమని నాకు బోధించుచుంటివా ! ఎంతసాహసము. మాయగ్రజుఁడగు రామభద్రుఁడులేని యీరాజ్యము నేను పాలింతునా ! నేనును రామచంద్రుఁడెచ్చటనుండునో కనుగొని యాతనిచరణముల సేవింపుచు నచ్చటనేయుండెదను.

(తెరలో)

కుమారా! భరతా! నీవేల సందియమందెదవు. మీతల్లిగారు చెప్పినప్రకారము రాజ్యము పాలింపుము. నీవేలుదువనియేకదా ఆమె యింత ఘనకార్యము చేసినది.

భర—(కైకనుజూచి) కౌసల్యామహాదేవి యెట్లు పలుకుచున్నదో కంటివా ! ఆమె పలుకులు నాహృదయమున శరములకంటె నెక్కువతీవ్రముగఁ దగులుచున్నవి. ఓసీ! పాపిష్ఠికైకా! నీవునా పాలిఁటి మృత్యుదేవతవుగాని తల్లివిగావు. నీవుజంతుహింసనాచరించు కటికవాని గర్భమునఁ బుట్టవలసిన దానవుగాని రాజకులమునఁ బుట్టవలసిన దానవు కావు. నిన్నుభరానికి బలియిచ్చినచో నిట్టిదుష్కార్యమాచరించినకాంత చచ్చెనని లోకము సంతసించును. ఈవ్రేటున నీతలఖండించెదఁగాచుకొమ్ము. (ఒఱనుండి ఖడ్గము దీయుచున్నాఁడు.)

శత్రు—(తొందరగాఁ బ్రవేశించి భరతుని చేయిపట్టుకొని)
(శత్రుఘ్నుఁడు ప్రవేశించి పాడెడిపాట.)
కేదారరాగం-ఏకతాళము.

ప॥ తాళుమా తాళుమా॥ నీమనమున। శాంతమూని యూర
కిని । తాళుమా॥

అ॥ ప॥ లలితచరితభరతమా౯కు యూలలన తల్లిగాదుతలపకిటుల జంప
నెంచితివు మహాఅఘుమగుా । తాళుమా!

తే. గీ. తాళుతాళుము సోదరా ॥ తల్లిఁజంపి
పాపమేటికి గట్టుకో ॥ భావమందు
తలఁచినాఁడవీవిధమున ॥ లలితచరిత
నాతియూమెను బ్రోవుమా ॥ సవ్యకరుణ.

సోదరా ! ఎంతసాహసము సేయనెంచితివి ! ఒకవేళ యీమె
యందు దోషముండిన నుండుగాక ! తల్లిని జంపుదువా ! ఇట్టికార్య
మాచరించినపిదపఁ దలయెత్తి మెలఁగనక్కఱలేదా ! చాలు, శాంత
ముదాల్చుము.

భర—తమ్ముఁడా!

తే. గీ. అన్నగారికి ద్రోహంబు ॥ నాచరించె
తండ్రిపాలిటి మృత్యువై ॥ తనరెనీమె
నీమెజంపిన బాపంబు ॥ నెంతయైన
బొందగాఁబోము మనమింకఁ ॥ బుడమియందు.

శత్రు—ఇంకనీకోపంబు జాలింపుము. మనకోపముజలలపైనయాచూ
పించుట! ఇట్టిదుష్కార్య మాచరించినచో రాముఁడు మనమొ
గము జూచునా? లోకము దీనింగూంచి మనపై నిందవేయదా?

[తెరలో]

ఉ. శాపతెనంచుఁ గోరుకొని ॥ కైక ధరాతలమెల్ల నీకు నం
భావితలీల మోదమునఁ ॥ బట్టముగట్టగ నింక నేల నీ

భావమునందు సంశయము ౯ పాలన సేయు మరాజకంబునై
భూవలయంబు బాగుగను ౯ భూరిగుణాకర పుత్రరత్నమా.

భర—(శత్రుఘ్ను నిఁజూచి) తమ్ముఁడా! చూచితివా? కౌసల్యామహా దేవిగారి వాక్యములు. ఇవివజ్రబాణమువలె హృదయమును భేదించుచున్నవి. ఏమిసేయుదును. (ప్రక్కందిరిగిచూచి) ఓ కౌసల్యామహాదేవీ! కైక గావించిన దుష్కార్యములనుగూర్చి నే నేమైన నెఱిఁగియుంటినేని బ్రహ్మహత్యాపాతకము జేసినవాఁ డనగుదును. భంజాలినిదై యిట్టిసాహసకార్యమాచరించినవా తల్లి పలుకులువిని రాముఁడు లేని యీరాజ్యము నేను బాలింతునా? తల్లీ! రామునియందున్న నాభక్తి నీవెఱిఁగియుండియు నిట్లేల పచించెదవు జననీ! నీపాదసాక్షిగఁ బల్కుచుంటిని. నే నిదే ప్రయాణమై యున్నగారెక్కడనుందురో యక్కడ కరిగి యాయన చరణములపై వ్రాలి బ్రతిమాలుకొని, అయోధ్యకు దోడి తెచ్చెదను. (శత్రుఘ్నునిఁజూచి) తమ్ముఁడా! నీవిప్పుడే గురుఁడగు వసిష్ఠునికడకరిగి, నేను రామచంద్రుని సన్నిధి కరుగుదునని చెప్పి ప్రయాణసన్నాహము సేయుము.

కైక—(తనలో) అన్నా! నేనీకార్య మేలయాచరించితిని. కుమారుని సంగతి దెలియక యిట్లుచేసితినే? ఇతఁడు నామాట వినలేడు. (ప్రకాశముగా) కుమారా! నావాక్యము లాలింపవా? పలువురిలో నన్ను దలవొత్తి మెలఁగనీయవా?

భర—ఇంకను సిగ్గులేక పలుకుచుంటివా? దుష్టాత్మురాలా! నీకీ పాపహితోపదేశమును జేసినవారెవరు?

[తెరలో]

మంథరయని కొలుంగుచు.

భర—అవురా! మంథర యిట్టి దుర్బోధ జేసెగా!

(తెరలో) నీవువచ్చెదవని నూతిలోఁ బడఁబోవుచున్నది.

భర—ఇదేవచ్చుచున్నాను. పోనీయక పట్టుకొనుఁడు.

(నిష్క్రమించుచును.)

[తెరవాలును.]

రంగము:—[చిత్రకూటము—ప్రవేశము, శ్రీరాముఁడు, సీత.]

శ్రీరా—(సీతంగాంచి)

[సీతనుగూర్చి రాముఁడుపాడెడిపాట.]

హిం॥ ముఖారిరాగం-ఆదితాళము.

ప॥ యోసతి బడుచుడుమల్ । నేగనజాలనహా॥ యోసతి॥

అ॥ ప॥ భాసురదివ్యభవనములందు । హంసతూలికాతల్పములందు

యోసుకుమారివిహరించి తుదకీయడవులలో బడియడలవలసె

యోసతి॥

హా, సర్వే, శ్వ, రా, కృతన్, గాంచు, మా, మనుస॥

తే. గీ. ఎండకన్నెఱుఁ వానక న్నెఱు యెఱుఁగ

కెప్పుడక్కట నావెంట । నేగుదెంచి

పడగ రానట్టి కష్టముల్ । పడుచునుండఁ

జూచియోర్తు నిన్నును । సుందరాంగి.

ఓ జనకరాజపుత్రీ! నీవుపడుచున్న కష్టములు చూడలేక నాగుండెలు పగిలిపోవుచున్నవి. వేనవేలు దాసీజనములు నిరంతరమును భక్తిమీ ఆసేవింప శుద్ధాంతసౌధంబులందు వసియించు నీకు భీకరశార్దూలమృగంబుల కాకరమైన ఘోరారణ్యములందు వసించుగతి బట్టెనుగదా? అయ్యయ్యో! నామూలముగ నెట్టిశ్రమలు బడుచున్నావు. నన్ను వివాహమాడి నిరంతరమును సౌఖ్యంబుభింంచెదనని తలంచి నాకు నిన్నుసంగాని నాతోడ నీవుగూడ నరణ్యముల పాలగుదువని నీతం

డ్రితలంపలేదుగదా ? నావెంట రావలదని యెన్నిసార్లునొక్కి వక్కాణించినను వినకవచ్చితివి. అహో! నీదేహమెట్లు శుష్కించినదో! పంచభక్ష్య పరమాన్నములతోడను, దధిఘృతక్షీరములతోడను నను దినంబును భుజియించునీవు కందమూలములఁ దినుచుంటివి.

సీత—నాథా! ఎట్లు పలుకుచుంటివి. నేను గష్టములఁ బడుచుంటినా? పతిఁ బెంగటలేకుండ వేనవేలు దాసీజనంబులు పరిచర్యను సేయుచుండ సౌధంబులయందు వసించుచుండినను పడతికి సౌఖ్యము గలుగునా? పతినివిడచియున్న సతిబ్రతుకేల, ఎన్నికష్టములు ప్రాప్తించినను పతినిమాత్రమున్న నెడఁబాయక చరించు సద్గుణాఢ్యయగు యువతి యువతులోకపూజితయగును. ప్రాణేశ్వరా! నేను శ్రమపడుచుంటినని తలఁపవలదు. నేనుపడుచున్న శ్రమయంతయు నాకు సౌఖ్యముగనే యున్నది. ఎన్నఁడును మిమ్ముల నెడఁబాయకుండుటయే నాకుఁ గావలసినది.

శ్రీరా—రమణీ! నాయందుభక్తిచే నట్లు పలుకుదువుగాని శ్రమ సుఖమెట్లగును?

సీత—చీఁకటులుపోయి వెన్నెలవచ్చునట్లు కష్టసుఖములు సమముగా ననుభవింపవలయును.

(తెరలో ధ్వని)

సీత—ప్రాణేశ్వరా! ఏదియోధ్వని వినవచ్చుచున్నది. రాక్షసులెవ్వరును కారుగదా?

శ్రీరా—అయిననేమి! ఇదిగో ఖడ్గము, ఇదిగో శరము.

సీత—నీయండనుండగా నాకేమిభయము?

శ్రీరా—(ఎదుటజూచి) ఫలార్థమైయరిగిన లక్ష్మణుం డెందులకో తొందరగా పరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు.

[కరవాలధరుఁడైన లక్ష్మణుఁడు ప్రవేశించును]

లక్ష్మ—(వెనుకకుఁజూచుచు కోపముతో)

మ, ధరణీరాజ్యము నెల్ల గైకొనియు స్వాంతంబందునూహింపకే
కరణిం గాననమున్ వసింపగను వేడ్కం బంపి యుద్ధానికిన్
బరితృప్తిం గనలేక రాముని నిఁకన్ భంజింపఁగా నెంచితే
భరతా! రమ్ము ఖరాసిబూనితి నిదే ప్రాణంబులం దీయగన్,
తే, గీ, సోదరుని వధియించిన సూడుకాఁడఁ
టంచు నిందవచ్చినను నే నందువాఁడ
పాపకృత్యము సేయ భావమున నెంచు
నీదు ప్రాణముల్ దీసెద నిక్కముగను.

ఓరీ! మహాపాతకవర్తి! భరతా! ఎంతదుష్కార్యము చేయ సాహసించితివిరా? కైకకిట్టి తుచ్ఛమంత్రముపదేశించి, రాజ్యము స్వీకరించి శ్రీరాముని నడవిపాలుగావించి యంతట నూరకొనక నీయనఘునిపైకిఁ గయ్యమున కరుదెంచితివా? గురుద్రోహము గట్టుకొనదలఁచితివా? ఓరా! నీకిట్టి యుపదేశ మెవ్వరుచేసిరి? నీవిట్టిదుర్నీతిపరుఁడవై యరుదెంచుచున్న నిన్నిప్పుడే యంతంబొందించి కైకను నపుత్రవతిగాఁ జేసెదఁగాక!

శ్రీరా—హరహరా! పాపముశమించుగాక, (లక్ష్మణునింజూచి) లక్ష్మణా! ఏమిది! ఇంతకోపమేల? ఎవ్వరిపైన నాగ్రహముజూపుచుంటివి? కారణములేక భరతుని నేలదూషించెదవు? అతఁడు నీయెదుటలేఁడే! అతఁడేమి! నీపైకి దండెత్తివచ్చుటేమి? తమ్ముఁడా! నీకేమైన గ్రహముసోకెనా? పిచ్చిపట్టెనా? ఇటురమ్ము.

లక్ష్మ—అన్నయ్యా; నాకుగ్రహముసోకలేదు, పిచ్చిపట్టలేదు. భరతుఁడు సైన్యసమేతుడై నీమీదిదాడొగ్గు నలువచ్చుచున్నాఁడు. మీరు చూడక యిట్లు పలుకుచున్నారు. భరతుఁడనఁగా

నేమోయని తలంచితిని. హా! రా దుర్మార్గుఁడు! ఎంతసాహస
ముఁబూనెను.

తే. గీ. భక్తియుంగము నీరీతిఁ బాఱఁద్రోలి
యన్నయనుమాటఁ గూరఁత బొమ్మగలిపి
నీకు నిలుగలఁగల్పించ నిక్కముగను
వచ్చునాతని జంపుదు భవ్యచరిత.

శ్రీరా— తమ్ముఁడా! శాంతివహించి యిటకూర్చుండుము. నీవెంత యజ్ఞానాబ్ధిలోఁబడితివి. భరతుని యంతరంగ మెఱుఁగక యిట్లు వలికితివి. అతఁడు హానిగూర్చునట్టి వాఁడుగాఁడు. నాయందు మి గులభక్తిఁబూని చరించువాఁడు. అట్టిభరతుఁడేమి? నాకుఁ గీడు సేయవచ్చునేమి?

లక్ష్మ— భరతుఁడువచ్చుట యసత్యమందురా యేమి?

శ్రీరా— అతఁడు రావచ్చును. కాని యెట్టికుకృత్యమును జేయుటకు రాఁడు.

లక్ష్మ— సమస్తమును దెలిసిన నీవట్లన్న నేనేమందును! భరతుఁడు నిన్ను దర్శించుటకు వచ్చువాఁడేని సైన్యమేల?

శ్రీరా— తమ్ముఁడా! అతనియూహ యిట్లుండును. మనలనెట్లయిన బ్రతిమాలుకొని దోడ్కొనిపోవలెనను తలంపుతో వచ్చుచుండును. అంతియెగాని వేఱొక దురభిప్రాయముబూనిరాఁడు.

[అంత వసిష్ఠమహామునితో భరతుఁడు ప్రవేశము.]

[భరతుఁడు రామునికడకు ప్రవేశించి పాడెడిపాట.]

పీలూరాగం— ఏకతాళము.

ప॥ రామ । రామ । రామ । సీతారామకీజయ్॥ రామ॥

అ॥ ప॥ కామసంబుత్యజియించిననే రామనామమంత్రమునకుసాటి
యేమిగలదు ధరనరయఁగ మనసా॥ రామ॥

సీతమతో శ్రీరాముని త్రిజగత్ పూజ్యునిభజించితరించజనపే
యీమాయలోకభ్రాంతివహింపక। రామ॥

వసి—(తనలో) ఈభరతుఁ డింతదూరము శ్రమపడివచ్చెనుగాని, విఫలమనోరథుఁడై మరల సాకేతమునకు మరలిపోవలసినవాఁడే యని తోఁచుచున్నది. నిరంతర సత్యవ్రతాచారపారీణుఁడును, జనకాజ్ఞాపరిపాలకుండును, సాక్షాద్విష్ణుస్వరూపుఁడును నగు శ్రీరామచంద్రుఁడు తాను బూనిన ప్రతినకు భంగముగా వర్తించునా! అట్లెన్నటికి వర్తింపఁడు.

భర—(వసిష్ఠునిఁజూచి) మునీంద్రా! అగుహుండు చెప్పిన ప్రదేశ మిదియేకదా?

వసి—అవును. అదిగో! ఎదుటఁజూడుము. అవ్వృక్షచ్ఛాయను సీతారామలక్ష్మణు లాసీనులైయున్నారు. మనము వారిని సమీపింత మురమ్ము.

భర—ఆహా! కాలమహిమ.

సీ. వరసౌధములయందు ॥ వసియించుపుణ్యుండు
వసియించుచున్నాఁడు ॥ వనములందు
హంసతూలికశయ్య ॥ నలరారు కడుభోగి
తనరుచుండెను నేఁడు ॥ దర్భశయ్య
మేలైనహారాళి ॥ మేనదాల్చెడివాఁడు
దాల్చుచున్నాఁడు రు ॥ ద్రాక్షమాలఁ
బట్టుబట్టలనెప్డు ॥ గట్టుచుండెడిభోగి
కట్టుచుండెను నార ॥ బట్టలెలమి

తే. గీ. భక్తిమీఱఁగ సెప్పుడు ॥ పరిజనంబు
గొలువతీవిమై తనరారు ॥ లలితచరితుఁ

దక్కటా భాగ్యములవీడి ? యడవులందుఁ
దనరుచున్నాఁడు నేఁడిదే ? ధాతవ్రాత.

అక్కటా! సీతామహాదేవి పొట్టి యిక్కట్లుపడుచున్నది. అలత్మ్మణుం డెట్లున్నవాఁడో. ఇంతనేనాలోచింపనేల. రామచంద్రుని సన్నిధాన మునకరిగి సమస్తమును విన్నవించి యయోధ్యకుఁదోడ్కొనిపోయెద. (వసిష్ఠునిఁజూచి) మునీంద్రా! తండ్రిగారిమరణ మీరామునకెట్లు విని పింతును.

వసి—ఇంక రాముని జూతమురమ్ము.

(యిరువురును శ్రీరాముని సమీపింతురు.)

లక్ష్మ—(రామునితో) అన్నయ్యా! వసిష్ఠసమేతుఁడై భరతుఁడువచ్చు చున్నాఁడు,

శ్రీరా—(లేచి) మునివర్యా!వసిష్ఠా! రాముఁడిదే మ్రొక్కుచున్నాఁడు,

లక్ష్మ— }
సీత— } (మ్రొక్కుదురు)

శ్రీరా—(భరతునిజూచి) తమ్ముఁడా! భరతా!

తే, గీ. అడవులకు నేను వీరితో ? నరుగుచెంచు
నప్పుడీవు పురమున లే ? వంచు మదిని
నెంతయోగుందినాఁడను ? చింతచేతఁ
జూడనైతిని నిన్నంచు ? శుద్ధచరిత.

భర—సోదరా! ఆపాపపుకైక గర్భమునఁబుట్టి నేనుగూడ నిందకుఁ బాలయితిని.

శ్రీరా—తమ్ముఁడా! ఇందు కైకమ్మగారుగాని నీవుగాని చేసినదేమున్న ది, తండ్రిగారి సత్యశాసనము నేను శిరమున ధరించితిని,

భర—దురాత్మురాలగు నాతల్లి యట్టివరములు గోరఁగనే తండ్రిగారు ముందు వెనుక లారయక యిచ్చిరి. వానినినీవుపాలింపఁదలంచి

వచ్చితివి. దీనివలన నెంతయుత్సవాటిల్లునో మీరలు తలంతు రైతిరి.

భర—(కన్నీరుగార్చును)

శ్రీరా—అయ్యో! ఇట్లు కన్నీరు గార్చెదవేల?

భర—అన్నయ్యా! చెప్పుటకు నోరాడకున్నది.

శ్రీరా—(వసిష్ఠునిజూచి) మునీంద్రా! ఈతఁడు,

తే. గీ. కన్నులను నశ్రుబిందువుల్ కార్చుచుండ
కారణంబేమొగాని వక్కంగ లేదు
దయవహించి నీవైనను దప్పకిపుడు
తండ్రికుశలంబు చెప్పుమా తాపసేంద్ర.

వసి—వత్సా! రఘువా!

ఉ. నీవిటులేగుదేరగను నీజనకుండు సమస్త సౌఖ్యముల్
బోవిడనాడి మానిశుల పుంగపుచెచ్చిన శావకారణం
బే విధియాట నీకొఱకు నెంతయుఁ జింతిలి రామ రాదు స
ద్భావచరిత్ర పుత్రయని తద్దయుఁగుందుచు వీడె జీవముల్.

(సీతా, రామ, లక్ష్మణులు మూర్ఛిల్లుదురు.)

[దశరథుని మరణవార్త విని రాముఁడు పాడెడిపాట.]

పీలురాగం—ఆటతాళం.

ప॥ హా మహా పాసిపోతివా తండ్రి। జగత్ప్రఖ్యాతచారిత్రయోధా ధాత్రిప॥హా॥

అ॥ ప॥ రామా రామాయంచు నీ। ప్రాణంబు వీడితివా।
రాముఁడే నీపాలిటి। మృత్యుదేవతయైపుట్టెనా॥హా॥

యేమాడ్కి భరియింతునా! యీవెతహృదయంబునన్
యీమొయిన నెట్టేకన్, ధృతిబూని! జరియింతు, నయోజ
నరా! హా!

శ్రీరా—(మూర్ఛ తెలిసి) హా తండ్రీ! నిరంతరసత్యవ్రతాచార పారీణా!

ము. జనకా! నీదగు సత్యశాసనము శిరక్షంబందునందాల్చి యీ
వనిలోనుండఁగరాగ మాకొఱకు నీ ప్రభావంబునం బెంగచే
దనయా! రాఘవ! రామ! యంచు ఘనచింతాక్రాంతచిత్తుండవై
నను నీరీతిని వీడిపోయితివె యయ్యయ్యా! యేమి సేతుంభువిన్.

తే. గీ. వనములకు మేము రథమునై వచ్చునపుడు
రథము వెంబడి వచ్చుచు రామరామ
అపుడంచును బ్రతిమాల నాపనైతి
నెంతపాపిష్ఠినోగదా యెంచిచూడ.

తండ్రీ! యిట్లగునని కలనైనఁ దలంపనైతిని.

లక్ష్మ—హాతండ్రీ! నేను నీపై నాగ్రహించితినని దేవతాధామమున కరిగితివా?

సీత—హా దశరథనృపా! మేమడవులకరుదెంచుటయే నీమరణమునకు కారణము.

వసి—కుమారులారా! గతించినదానికి మీరిట్లు చింతించిన లాభము లేదు. ముందుకర్తవ్యమాలోచింపుఁడు.

శ్రీరా—అంతటి దయాపరుఁడగు జనకుని మరణమువలనఁ గలిగిన దుఃఖము నెట్లు మఱతును.

వసి—వత్సా! రాఘవా! నీకు సమస్తమును దెలియును. ఇంక నీవు చింత విడుము.

భర—అన్నయ్యా! ఈదుష్కృతము మనకందఱికిని సమానమే. కైక మూలమున నేనుగూడ మీకాగ్రహము గలిగించితిని. మనల గన్నతండ్రి దివంబలంకరించె. నాతల్లి యీవరముల గోరుటనని నీపాదసాక్షిగ నెఱుంగను. నీవులేని రాష్ట్రము నేను బాలింతునా! ఆరాజ్యలక్ష్మిని ధరించుటకు నేను శక్తుండనగుదునా! కావున నాతల్లి యాచరించిన దోషమును సైరించి నాయందు గృపవహించి పురంబునకేతెంచి పట్టాభిషిక్తుండవై మమ్మును బ్రజలను బాలింపుము.

శ్రీరా—తమ్ముఁడా! కైకమ్మగారివలన దోషములేదు. నేను తండ్రిగారిసత్యము గాపాడ నేతెంచితిని. అదిపూర్తియగువఱకును బుర ప్రవేశముసేయుట ధర్మమునకు భంగము. నీవు చింతవిడచి నాకు మాఱుగ రాజ్యము బాలింపుచుండుము. వనవాసము పూర్తియొనపిదప నేవచ్చెదను.

భర—అగ్రజా! నీవెంత చెప్పినను సరే. నీవులేని పురమునకు నేను బ్రవేశింపఁజాల. నీపాదసేవ జేయుచు నిచ్చటనుండనిమ్ము.

శ్రీరా—అంత సాహసమువలదు.

భర—అట్లయిన నేనేమిచేయుదును?

శ్రీరా—అది గురులానతిత్తురు.

వసి—(భరతునిజూచి) భరతా! శ్రీరామచంద్రుఁడు వచించినమాట నిక్కము. నీవీతని పాదుకలఁగైకొని వానికభిషేకముజేసి రాముఁడువచ్చువఱకు నాతనిమాఱుగ రాజ్యమేలుము. (రామునిఁజూచి) రామచంద్రా! నీపాదుకల నీతని కనుగ్రహింపుము.

శ్రీరా—ఆనతి ననుసరించెద (పాదుకల భరతునికిచ్చును.)

[పాదుకలు శిరమునధరించి భరతుఁడు పాడెడిపాట.]

సురటరాగం—ఏకతాళం.

ప॥ధన్యుఁడనైతి నీపాదుకలనుగొనిధన్యుడనైతినిధరణినిక॥ధన్యుఁ

అ॥ ప॥ అన్యులుమెచ్చగ । సర్వరాజ్యమీ । పాదుకలకు పట్టాభిషేక
ముచేసి దోసిలొగ్గి సేవజేసెద॥ధన్యు॥

అన్యచింతలిక నాకేలను శ్రీరాముభజించి తరించెదనిక ధన్యు॥

భర—ఈపాదుకల కభిషేకమిచ్చుటనే యొనర్చెదఁగాక!

వసి—ఇచ్చుటఁ బీరము లేదే!

భర—వీనిని నాశిరమున ధరింతును. (శిరముపైఁ జెట్టుకొనును)

వసి—(ఉదకముజల్లును)

శ్రీరా—భరతా.

తే. గీ. ప్రజల బిడ్డలభాతి గా పాడుమయ్య
ధర్మమందున నిల్పు చి త్తంబునెపుడు
సత్యమేజయమని మాన సంబునందు
గట్టిగానమ్మి పాలింపు తమ్ముతలంబు,

(తెరవాలును.)

[సమాజికులందరు కలసి పాడెడిపాట]

జయంతశ్రీరాగం—ఏకతాళం.

ప॥ తల్లీ—పార్వతీ యిదేహారతి తల్లీ॥

అ॥ ప॥ యుల్లమలరగా గైకొని । చల్లనిచూపులగ గని మమ్మేలుము॥
తల్లీ॥

ముల్లోకములకు మూలమై విలసిల్లిమహిమలు విరజల్లీభక్తుల
నేలెడి తల్లి॥

సంపూర్ణము.

శ్రీమహాకవి

# కాళిదాసచరిత్రము.

(గ్రంథకర్తలు:—రామనారాయణకవులు.)

భోజరాజ, కాళిదాసకథలన్నియును సంపూర్ణముగఁగల గ్రంథ రాజము. ప్రస్తావములందు పఠింపఁదగిన శ్లోకరాజములన్నియు నిందు చక్కఁగ నిముడ్పబడియున్నవి. శ్లోకములక్రింద టీకాతాత్పర్యములు సయుతముగలవు. భోజకాళిదాస సంవాదరూపకమగు శ్లోకములుపూ ర్వపుప్రతులను విమర్శించి ప్రకటించితిమి. ఇప్పుడు ప్రచురింపఁబడుచు న్న ప్రతులన్నిటియందును మేలుప్రతి. గ్రంథకర్తలపేరును, ప్రకటన కర్తపేరునుఁ జూచి కొనగోరుచున్నాము. కాళిదాసుజన్మవృత్తాంతము, కాళిదాసువివాహము, పునస్సంధానము, కాళీప్రసన్నము, బాహ్మణ దర్శనము, భోజరాజుచరిత్రము, కాళిదాసు భోజరాజుసభలోఁజెప్పిన సమస్యాదులు. అశ్వినీదేవతలకథలు "టంటంటం"అనుసమస్య, బ్రహ్మ రాతుసకథ, చేపలరామాయణముకథ మొదలగు ననేకగాధలతో నిం డిన సంపూర్ణగ్రంథము ప్రతియింటనుండవలసిన యుత్తమగ్రంథము,

చదువనేర్చిన ప్రతియాంధ్రునిచేతి నలంకరింపవలసిన సర్వోత్త మగ్రంథము. మహాకవియగు కాళిదాసురచించిన గ్రంథములులభిం చుట సులభముగాని చాటువులుసమస్యలు లభించుట సులభముకాదు. ఆకవి చంద్రునిమేధాశక్తి, అపూర్వకవితారసధార, కల్పనాచమత్కృ తి. దివ్యమాహాత్మ్యము, ఉపమాలంకారప్రియత్వము నిందుప్రత్యక్షర మునందును ప్రజ్వలితమగుచుండును. కాళికాదేవితనకును, కాళిదాసువ కును భేదములేదని చెప్పుటచే నీయవతారపురుషుని మహత్తునెఱుంగఁగ లము. ఈచరిత్రము కేవలము వినోదముకొఱకు చదువుకొనుటకేకాక, పండితులతో సంభాషించునపుడును,సభలలో వాదించునపుడును,భక్తితో దేవీస్తోత్రముచేయుటకును నుపయోగములగుచున్నవి. ఇందుశ్యామలా దండకము నెయిలెను ముద్రింపఁబడియున్నది. కొలదిప్రతులుకలవు. త్వరపడవలెను.

వెల 1—0—0 మాత్రమే.

